ఓం

# విన్నపము

ప్రియభ్రాతులారా!

గీ॥ నిల్వఁగా నేలఁ జూడఁగా వెల్గుఁ గల్గి
త్రాగఁగా నీరుఁ దినఁ బండ్లు ధాన్యములనుఁ
గొల్లఁగాఁ బెట్టి జగమును నిల్పినట్టి
వారికి మనమీఁద నెంతటి కరుణ మనసా॥

వీక్షించితిరా! భ్రాతులారా! యొకదినమున నొకింత ఆహారమిచ్చినవారిని మన మెంతో శ్లాఘించి కీర్తించుచుందుమటయు, యెల్లవారికి యుల్లంబునకుఁ దెల్లంబెగదా. మహోత్కృష్టమై యొప్పు సకలైశ్వర్యమును ప్రసాదించు పరమేశ్వరుని మరచుటకంటె పాపమేమున్నది? అమూల్యమైన కాలమంతయు వ్యర్థముగ బుచ్చుచు, కాలయాపనము చేయుచు మన జీవితయాత్రను పాడుచేయుట మానవజీవితమున కెంత వ్యతిరిక్తమో యోచించుడు. సమస్తమును సంపాదింపవచ్చును గాని యొక దినమును సంపాదింపగలమా? దినము సంపాదింపవలెనన్న యేకేశ్వరోపాసనము చేయుడు. ధ్యానించుడు! కాలమును వ్యర్థముచేయక గృహచ్ఛిద్రముల నెల్ల నిర్వర్తించి ప్రతిదినము నాచెంత కరుదెంచి ఈశ్వరమహిమలను కడు శ్రద్ధతో వినుచు

భక్తి కుదుర్చుటకు సాధనముచేయు శ్రీమతి కొండూరు రంగమ్మగారు ఈశ్వరప్రార్థనము చేయునట్లు నొక పొత్తమును వ్రాయవలెనని నన్ను ప్రోత్సాహించినందున రెండు వేదముల (ఋగ్వేద, యజుర్వేదముల) నుండి శ్రీదయానందస్వాములవారు వ్రాసిన ఆర్యభాషను[illegible] ఆంధ్రీకరించినాడను. ఈ యీశ్వరస్తుతి ప్రార్థనము ప్రతివారును కనీసము దినమునకు రెండుసారులు, ప్రాతః సాయంకాలములందును, తీరికగలదినమంతయును, కీర్తించి ముక్తిజెందుదురని మిక్కిలి మక్కువతో వక్కాణించుచున్నాను. పాఠకులు ప్రోత్సాహించిన రెండవభాగము వ్రాయబూనెదను.

ఇట్లు,

యీశ్వరోపాసకుడు,

ఆర్యనారాయణరాజు,

పరిగి, జ॥ స్థా॥ మ[illegible]ళూరు.



ఓం.

తత్ సత్ పరబ్రహ్మణేనమః.

# అథేశ్వరస్తుతిప్రార్థనోపాసనాః ప్రారంభః

ఓం శం నో మిత్రః శం వరుణః శం నో భవత్వర్యమా శంనో ఇంద్రో బృహస్పతిః శంనో విష్ణురురుక్రమః ౧। ఋ॥ అ॥ ౧॥అ ౬॥ వ॥ ౧౮॥మం ౯॥

వ్యాఖ్యానం॥ హే సచ్చిదానందానంతస్వరూప హే నిత్య! శుద్ధ, బుద్ధ, ముక్త స్వభావ! ఓ అద్వితీయానుపమ! జగదాదికారణ ఓ అజనిరాకారా! సర్వశక్తిమాన్ న్యాయకారీ! ఓ జగదీశ సర్వజగదుత్పాదకాధార! ఓ సనాతనా! సర్వమంగళమయ! సర్వస్వామి! హే కరుణాకరస్వామి పితః! పరమసహాయకుడవు సర్వానందప్రద! సకలదుఃఖవినాశక! ఓ అవిద్యాంధకారనిర్మూలక! హే విద్యార్కప్రకాశక! ఓ పరమైశ్వర్యదాయక! సామ్రాజ్యప్రసాదక! ఓ అధమోద్ధారక! పతితపావన! మన్యుప్రద! హే విశ్వవినోద! వినయవిధిప్రద! హే విశ్వాసవిలాసక! ఓ నిరంజన! నాయక! శర్మద! నరేశ! నిర్వికార! ఓ సర్వాంతర్యామి! సదుపదేశక! మోక్షప్రద! హే సత్యగుణాకార! నిర్మల నిరీహ! నిరామయ! నిరుపద్రవ! దీనదయాకర! పరమసుఖదాయక! హే దారిద్ర్య! వినాశక! నిర్వైర్యవిధాయక! సునీతివర్ధక! హే ప్రీతిసాధక! రాజ్యవిధాయక! శత్రువినాశక! ఓ సర్వబలదాయక! నిర్బలపాలక! ఓ సర్వధర్మ

స్ప్రాపక! ఓ అర్థసుసాధక! సుకామవర్ధక! జ్ఞానప్రద! ఓ పం
తతిపాలక! ధర్మానుశిక్షక! రోగవినాశక! హే పురుషార్థప్రాపక!
దుర్గుణనాశక! సిద్ధిప్రద! ఓ పరమేశ! పరేశ! పరమాత్మ!
పరబ్రహ్మ! ఓ జగదానందక! పరమేశ్వర వ్యాపక!
సూక్ష్మచ్ఛేద్య! ఓ అజరామృత! భయనిర్బంధా! అద్వితీయ!
ఓ అప్రతిమప్రభావ! నిర్గుణాతుల్య! విశ్వేద్య! విశ్వవంద్య!
విదుద్విలాసక! యిట్లనంత విశేషణ వాచ్య! ఓ మంగళప్రదే
శ్వర! నీవుసర్వము అందరకు నిశ్చయమైన మిత్రుడవు. మాకు
సర్వసుఖప్రదములను సదా ఇచ్చువాడవు. సర్వోత్కృష్ట
మైనదానిని స్వీకరించినవాడవు.

వరేశ్వరా!నీవు వరుణుడవు. అర్థాత్ : సమస్తము పరమోత్తమ
మైనవాడవు. నీవు మాకు పరమసుఖదాయకుడవు. ఓ పక్షపాత
రహిత! ధర్మన్యాయకారీ! మాకు (అర్యమా) (యమరాజు)
న్యాయమును ప్రసాదించువాడవు. ఓ పరమేశ్వర! యింద్రే
శ్వర! నీవు అస్మదీయులకు పరమైశ్వర్యము శీఘ్రముగా
నిచ్చుదాతవు. ఓ విద్యావాచకమున కధిపతీ! (బృహస్పతివి)
పరమాత్మవు! (మా లోకమునకు) మా సమూహమునకు,
అధికమైన సుఖము ప్రసాదించు ప్రభుడవు. తండ్రీ! నీవు సర్వ
వ్యాపకుడవు. అనంతపరాక్రమేశ్వరుడవు. విష్ణువు. నీవు మాకు
అంతములేని సుఖము సదా ప్రసాదించుము. నీవు తప్ప
కొంచమైనను సుఖమిచ్చువారు మరెవ్వరును మాకు గాన
రారు. మాలోకమునకు నీవు ఆశ్రయము. మరెవరును గన
బడరు. సర్వశక్తిమాన్!న్యాయకారీ! దయామయా! అంతరును

గొప్ప తండ్రిగా నుండు నిన్ను వదలి, నీచులను ఆశ్రయము చేయు విధానము మాన్పుము. తండ్రీ! త్రికరణశుద్ధిగా నిన్నే నమ్మెదము. మమ్మును నుద్ధరించువాడవు. నీవుతప్ప మరెవ్వరు లేరని దృఢనిశ్చయముగా నమ్మినారము.

(మూలస్తుతి విషయం.)

అగ్నిమీళే పురోహితం యజ్ఞస్య దేవమృత్విజం హోతారం రత్నధాతమమ్॥ అ॥ ఋ॥ ౧॥ ౧॥ ౧॥

వ్యాఖ్యానం॥ ఓ వందనీయాగ్నే! నీవు జ్ఞానస్వరూపుడవు. మేము నిన్ను కీర్తించుచున్నాము. సర్వమనుష్యులకును ఉపదేశించు పరమాత్ముడవు. సర్వజీవులును నిస్తుతి ప్రార్థన మరి ఉపాసనమును చేయుదగువాడవు. ఎట్లు తండ్రి గురువు, బిడ్డలకును శిష్యులకును శిక్షజెప్పగలరో, ఆవిధముగ నీవు గురువు మేము శిష్యులము. మాకు ఉపదేశించి అవిద్యాంధకారమునుండి తొలగించి విద్యాది పదార్థములను దయచేయుము. జ్ఞానము పరమార్థము అత్యంతసుఖము నిచ్చు అధికారము ఈశ్వరా నీయందున్నదిగాని మరియెవరియందున్నది? గురూ! ఓ సర్వహితోపకారకా! (పురోహితుడ.) సకలజగత్తునకును హితముచేయువాడవు. ఓ యజ్ఞదేవా! సర్వులకు పూజనీయుడవు. మరియు పావనాది యజ్ఞములను ఇచ్చినవాడవు. (కమనీయుతం), ఓ ఋత్విజమ్! అన్ని ఋతువులు అనగా వసంతాది ఋతువులను చేసిన మహోపకారివి హే హోతారం! సమస్తజగత్తుకును క్షేమములను దయచేయు దయామయుడవు. మరి ప్రళయసమయములో సమస్తమును

సమయింపుచేయువాడవు(రత్న ధాతమం)రత్న అర్థాత్ రమణీయ
మైన పృథివి మొదలగు పదార్థములను చేసి ధరించినవాడవు.
అనేక రత్నములను ధరించినవాడవు. నీవు ఒక్కడవే సర్వశక్తి
మాన్! పరమాత్మా మేము సదా ఉదయం సాయంకాలం
నిన్ను స్తుతించి కీర్తించెదము. మాయొక్క వినయమైన నమ
స్కారములను పరిశుద్ధమైన ప్రార్థనమును స్వీకరించి మాలోక
వాసులను సుఖముగా నుంచుదువుగాక.

— * మూలప్రార్థన * —

అగ్ని నా రయిమశ్నవత్పోషమేవ దివేదివే యశ
సం విశ్వాత్త మను ॥౩॥ ఋ॥ ౧॥ ౧॥ ౧॥

అ॥ ఓ మహాదాత! ఈశ్వరా! నీయొక్క కృపచే
మేము జీవించి నిన్ను స్తుతించెదము. నీ విద్యాది ధనమును
మరి సువర్ణాది మొదలగు లోహములను అవశ్యకముగా
మాకొఱకై సృజించినావు. దినమనే ధనమును పోషించి
మాకు మేలొనరించుము. తండ్రీ! మరి విద్య శౌర్య, ధైర్య
చాతుర్య, బలము, పరాక్రమము, దృఢాంగమును, ధర్మాత్మ
మును, న్యాయమును, అతి వీరపురుషత్వమును ప్రాప్తిం
చుము. పోషకా! రత్నములు మొదలగువానికి చక్రవర్తివి.
విజ్ఞానమనే ధర్మమును మాకు దయచేయుము. ప్రభూ! నిన్నే
నమ్మి నిరతము సుఖవంతులముగ నగుటకు నీ ప్రసాదమును
పొందెదము.

ఓం విశ్వాని దేవ సవిత ర్దురితాని పరాసువ యద్భ
ద్రం తన్న ఆసువ॥ యు॥ ౩౦॥ ౩॥

అర్థం॥ ఓ జగదుత్పాదక! జగదీశ్వరా! మమ్ములను సమస్తపాపములనుండి దూరముగనుంచి మాకు సమస్త శుభములను ప్రసాదించువాడవగుము.

ఓం హిరణ్యగర్భః సమవర్తతాగ్రే భూతస్యజాత పతిరేక ఆసీత్ సదాధార పృథివీం ద్యాముతేమాం కస్మైదేవాయ హవిషావిధేమ॥ ౨౦॥ యజు॥ ౧౩॥ ౪॥

అ॥ సూర్యాది జ్యోతిర్మండలములకు ప్రకాశమును ప్రసాదించువాడవు నీవు. ఆద్యంతములు లేనివాడవు నీవు. ప్రచండభూతములకు ప్రసిద్ధిమైన స్వామి నీవు. సమస్తలోకములకు ఆధారభూతుడవు నీవు. నీకన్నను పూజకు యోగ్యమైన దేవుడు మాకు మరెవరుందురు?

౩॥ ఓం య ఆత్మదా బలదా యస్య విశ్వ ఉపాసతే ప్రశిషం యస్యదేవాః యస్యచ్ఛాయా అమృతం యస్య మృత్యుః కస్మై దేవాయ హవిషా విధేమ॥ యజు॥

అ॥ సమస్తబలములను ప్రసాదించువాడవు నీవు. ఉపాసకుల కందరికి ఉపాసనకు యోగ్యమైనవాడవు నీవు. విద్వాంసుల కందఱికిని గురువుగా నెన్నబడువాడవు నీవు. నీ ఆశ్రయమే మోక్షము. నిన్ను విడుచుటయే మృత్యువు. నీకన్నను పూజించుటకు యోగ్యమైన వేల్పు మాకు మరెవరున్నారు?

౪॥ ఓం యః ప్రాణతో నిమిషతో మహిత్వైక ఇద్రాజా జగతో బభూవ య ఈశే అస్యద్విపద శ్చతుష్పదః కస్మైదేవాయ హవిషావిధేమ॥ య॥ ౨౩॥ అ॥ ౧౧॥ మం॥

అ॥ జడ చేతనాత్మకము మొదలైన లోకములకు మనుష్య, పశు, పక్షి, మొదలైన సమస్తప్రాణులకు ప్రఖ్యాతి గాంచిన ప్రభువు నీవొక్కడవే. నీకన్నను పూజకు యోగ్యమైన దేవుడు మాకు మరెవరున్నారు ప్రభూ!

౧౦ ఓం యేన ద్యౌరుగ్రా పృథివీచ దృఢా యేన స్వ స్తభితం యేన నాకః యో అంతరిక్షే రజసో విమానః కస్మై దేవాయ హవిషా విధేమ॥ య॥ ౩౨॥ అ॥ ౬॥ మం॥

అ॥ సూర్యాది మొదలగు గోళముల తేజమునకు పృథివ్యాది లోకముల ధృఢత్వమునకు, సుఖసంతోషమునకు మోక్షానందమునకు, నీవే ఆధారభూతుడవు. నీ మహిమనుండియే ఆకాశములో పక్షులవలె అనంతకోటి బ్రహ్మాండములు తేలియాడుచు ప్రకాశించుచున్నవి. నీకన్నను ధ్యానార్హుడైన దేవుడు మాకు యెవరున్నారు?

౧౧ ఓం ప్రజాపతే నత్వ దేతాన్యన్యో విశ్వాజాతాని పరితాబభూవ యత్కామాస్తే జుహుము స్తన్నో అస్తు వయం స్యామ పతయో రయీణాం॥ య॥ ౨౩॥ అ॥ ౩౬॥ మం॥

అ॥ జడచేతనాత్మకములగు సమస్త ప్రపంచమునంతను నిండి నిబిడీకృతముగా నుండు నీకన్నను ప్రసిద్ధమైన ప్రభువు మరెవ్వరుందురు? మాకు యేవి యావశ్యకములో వాని కెల్లను నీవే ఆశ్రయుడవు ప్రభూ! మమ్ములను సకలైశ్వర్యయుక్తులుగ చేయువాడవు కమ్ము॥

౧౨ ఓం సనో బంధుర్జనితా సవిధాతా ధామాని వేద భువనాని విశ్వా యత్రదేవా అమృత మానశానాస్తృతీయే ధామన్నధ్యైరయంతే॥ ౬॥ యజు॥ ౩౨॥ ౧౧॥ మం॥

మాకందరకును ఆ పరమాత్మయే తండ్రియు బంధువు. ఆప్రభువునకు తెలియని లోకమే లేదు. తెలియని పదార్థమే లేదు. తెలియని విషయమే లేదు. సర్వము ఆ సర్వేశ్వరునకు వేద్యము. ఆ పరమపురుషునినుండియే విద్వాంసు లందరు మోక్షానందమును పొంది స్వేచ్ఛావిహారమును సలుపు చుందురు.

౧౩ ఓం అగ్నే నయ సుపథా రాయే అస్మాన్ విశ్వాని దేవ వయునాని విద్వాన్ యుయోధ్యస్మ జ్జుహురాణ మేనో భూయిష్ఠాం తే నమ ఉక్తిం విధేమ ॥ య॥ అ॥ ౩౬॥ మం॥

అ॥ జ్ఞానస్వరూపియైన పరమాత్మా! నీవు సమస్త విద్యలన్నిటిలోను సంపూర్ణ విద్వాంసుడవై యొప్పుచుందువు. మమ్ములను సన్మార్గమునందుంచి సర్వైశ్వర్యయుక్తులుగను సర్వవిద్యావంతులుగను జేయుము. మా కుటిలత్వమును పరిహరించుము. భక్తిపూర్వకముగా అనేకవిధముల నిన్ను సేవించెదము. ఈసవినయమైన ప్రార్థనమును స్వీకరించుము॥

౧౪ తచ్చక్షుర్దేవహితం పురస్తాచ్ఛుక్ర ముచ్చరత్ పశ్యేమ శరదః శతం, జీవేమ శరదః శతంగ్, శృణుయామ శరదః శతం, ప్రబ్రవామ శరదః శత మదీనాః స్యామ శరదః శతం, భూయశ్చ శరదః శతాత్ ॥ ౩౭॥ యజు॥ ౩౬॥ ౨౪॥

అ॥ జగదీశ్వరా! నీవు సర్వసాక్షివై యుండి, విద్వాంసులకు అనగా భక్తులకు హితుడవయ్యి, మనోహరుడవయ్యి, సర్వవ్యాపకుడవయ్యి, ఆదికారణుడవయ్యి, శుద్ధస్వరూపుడవయ్యి, సర్వోత్తముడవయ్యి, ప్రకాశించెదవు. నీకృపచే

మేము నూరు సంవత్సరములు జీవించినను, దానికన్న హెచ్చుగ జీవించినను నిన్నే చూచుచు, నిన్నే సేవించుచు, నిన్నే అడుగుచు, నిన్నే పొగడుచు, దీనత్వమును విడిచి ధైర్యముతో జీవించునటుల నీవు మమ్ములను అనుగ్రహించుము తండ్రీ!

ఓమ్ స్వస్తినో మిమితా మశ్వినా భగః స్వస్తిదేవ్యదితిరనర్వణః స్వస్తి పూషా అసురో దధాతనః స్వస్తి ద్యావా పృథివి సుచేతనా॥ ఋ॥ ౫౫॥ 3॥ 2వ॥

ఓ స్వస్తిదా! స్వస్తిరూప! పరమాత్మా! మాయుపాస్యేష్టదేవుడవు నీవె యగుదువు. మా నిశ్చలమగు విశ్వాసంబెల్ల నీయందే నిలిచినది. మా దుర్బల హృదయములను పుష్టులను, శ్రేష్ఠములనుగా జేయుదువుగాక. వినిగ్రహితకర్మలనుండి మమ్మ రక్షింతువుగాక. మా సంపూర్ణాయువు విషయసేవనమందే వీక్షణమగుచున్నది. అస్మత్సదృశులగు మూర్ఖులెవ్వారు ఈ మానవజీవనమునందుండియు నేమి లాభమయ్యె? ఓ తండ్రీ! ఏ ప్రభావమువలన మా బుద్ధులు నిర్మలంబై భవదీయ వైదిక ధర్మముచే సంస్కృతములగునో యట్టి సత్య, ధర్మ, దీక్ష ప్రభావములచే మమ్ము దీక్షితుల జేయుము. దృఢత్వము, మా చిత్తములనుండి యెపుడును భగ్నముకాకుండ గాపాడుము.

ఇచటి గౌరవ, మాన, ప్రతిష్ఠలు, నిచ్చటి సుఖ సంపదలు క్షణికములనియు, భవదాజ్ఞానువర్తనమే మా జీవితకాల పర్యంతము పాలించులాగున ప్రసాదించుము. భవత్కృపచే సన్మార్గాదుల కెల్లపుడును స్మరణమగుగాక. మేము చేయు యావ

కాయిక వాచిక మానసిక కర్మములను భవదిచ్ఛా ప్రతికూలములు గాకుండు గాక. పరేశా! అపవిత్రమగు విషయాసక్తులాదిగాగల దుర్వ్యసనములు, మాహృదయమునుండి దూరపరతువు గాక. అనర్థదాయకములగు కుచేష్ట, కుసంస్కారి, కువాదము స్వార్థపరత్వము, ఓర్వలేనితనము, కూటసాక్ష్యమునుండి తప్పించి మమ్ము మిథ్యాహంకార, వ్యర్థ ద్వేష, వేష, స్వార్థములనుండి దూరపరతువుగాక. ప్రభువరా! భవదీయ స్తుతి, భవదీయ ప్రార్థన, భవదీయ ధ్యానము సంపు తెలాపుల నిత్తువుగాక. అట్టి కోరికలకు విఘ్నకారకములగు ప్రతిక్రియలు నిర్మూలము చేయుదువుగాక. భవదీయ యాజ్ఞాపాలనమున ఈ కళేబరము లీపృథివిపై నిలుపుదువుగాక.

ఓం. తత్సత్.

౧౫ ఓం భూర్భువస్వః తత్సవితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి ధియో యోనః ప్రచోదయాత్ ॥ య॥ ౩౬॥ ౩॥

అ॥ సర్వరక్షకా! పరమేశ్వరా! నీవు సర్వాధారుడవయ్యు సర్వదోష నివారకుడవయ్యు సర్వవ్యాపకుడవయ్యు సర్వజగదుత్పాదకుడవయ్యు సర్వజ్ఞుడవయ్యు సర్వానందదాయకుడవయ్యు, సర్వపూజ్యుడవయ్యు మెలయుచున్నావు. ఇట్టి నీ మనోహర స్వరూపమును మేము ధ్యానించెదము. సర్వేశ్వరా! నిన్ను సందర్శించి నీయాజ్ఞారూపమైన సత్కార్యములను చేయునట్లు మా బుద్ధియందు ప్రేరేపించుము.

౧౬ ఓం నమః శంభవాయ చ మయోభవాయ చ నమః శంకరాయ చ మయస్కరాయ చ నమః శివాయ చ శివతరాయ చ॥ ౨౬॥ యజు॥ ౧౬॥ ౪౧॥

మంగళ స్వరూపుడవయ్యు, సుఖాధారుడవుగను మంగళ ప్రదుడవుగను, సుఖప్రదుడవుగను, మంగళస్వరూపుడవుగను, సుఖస్వరూపుడవుగను మెరయుచుండు అత్యంత మంగళస్వరూపుడవైన పరమేశ్వరా! నీకు నమస్కారము. పదేపదే నమస్కారములు.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

ప్రతివారును ఈ యీశ్వరస్తుతి ప్రార్థనములను ప్రాతః సాయంకాలముల (అనగా) సంధ్యాకాలములందు ధ్యానించి ఆ పరమపిత కృపకు పాత్రులై ప్రపంచమునకు పరోప కారులై పరబ్రహ్మ పాదారవిందములు చేరుకురని ప్రార్థించు

మీ హితాభిలాషి,

ప్ర॥ పరిగిగ్రామం దయావంతుల పాదసేవకుడు,

ఆర్య నారాయణ రాజు,

సహాయకులు: అహింసా జ్ఞానప్రచారక సంఘము

మా॥రా॥ కే. క్రిష్టరావుగారు, పరిగి. కార్యదర్శి,

పోషకులు: మరభూరు

శ్రీమాన్ ఆర్. నారాయణరెడ్డిగారు,

శ్రీ కె. నారాయణరెడ్డిగారు, పరిగి.

